# సాధనసమితి కార్యనిర్వాహక వర్గము

అధ్యక్షులు :

శ్రీ బూర్గుల రంగనాథరావు

ఉపాధ్యక్షులు :

శ్రీ జమ్మలమడక పూర్ణచంద్రరావు

కార్యదర్శి :

శ్రీ నెల్లూరి కేశవస్వామి

సంపాదకులు :

శ్రీ భాగి నారాయణమూర్తి
శ్రీ దేవులపల్లి రామానుజరావు
శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

ఆడిటరు :

శ్రీ జమ్మలమడక సూర్యప్రకాశరావు

ములు, సాహిత్యవిమర్శనలు మున్నగునవి కలవు. ఇప్పుడు సమితివారివలన ప్రకటింపబడుచున్న "ప్రత్యూష" పైవాని లోనిదిగాక యొక క్రొత్త పద్ధతినవలంభించినదని పాఠకులు చూడగలరు.

"ప్రత్యూష" కేవలము పద్యాత్మకము. దీనిలో ఇరువంది కవివర్యుల కొన్ని కొన్ని రచనలను ఒకచోకూర్పబడినవి. కొన్ని వత్సరముల క్రింద ఆంధ్రమున "వైతాళికులు" అను పేరున క్రొత్తవారును ఉపజ్ఞకలవారునునగు పలువురు కవిశేఖరుల రచనలనొకతావున ఏరికూర్చి ప్రకటింపబడిన పుస్తకము ఆంధ్రపాఠక ప్రపంచమునకు జ్ఞాపకముండునని తలంచుచున్నాను. ఆ గ్రంథమే సాధనసమితి కార్యనిర్వాహకులను "ప్రత్యూష" ను ప్రకటింప ప్రేరేపించినట్లు కానవచ్చుచున్నది. దీనిలోగూడ ఈ ప్రాంతము, అనగా తెలంగాణమున, గడచిన కొన్ని వత్సరములలో రచయితలుగ ప్రఖ్యాతిగడించిన యువకవుల పద్యములను గేయములను సంగ్రహించి కూర్చబడినవి. 'యువకత్వము' యొక్క మానము (Standard) నిర్ణయించుటకష్టమే అయినను, సమితివారివలన నీగ్రంథమున ప్రవేశమునందిన వారిలో దాదాపుగా నందరును నవీనులును, వయసుదాటని యువజనులలోని వారను అయియున్నారని నా యూహ. ఒకరిద్దరి పేళ్లుమాత్రము పాఠక మహాశయులకు అపవాదములు గానరావచ్చును.

"ప్రత్యూష" లో ప్రవేశ గౌరవము గాంచిన వారిలో నిద్దువురు కవయిత్రులు నుండుట చాలయోగ్యముగనున్నది.

దీనిలో వచ్చిన కవిశేఖరుల జీవితాంశములను, సంగ్రహముగ నేయగుగాక, పుస్తకపు తుదిభాగమున చేర్చుట చాల మంచి పనియైనది.

మొత్తముమీద, సమితివారి యుద్దేశము, తెలంగాణమునున్న నేటి కాలపు నవ్యకవులను, ఆంధ్రవాచక ప్రపంచమునకు పరిచితులజేయుట యేయని స్పష్టముగా తెలియుచున్నది. ఇట్లనుట, నేటి తెలంగాణములోని యువ కవులందరును ఈ సంపుటమున గానవత్తురని తలంపవీలులేదు. ఇట్టి కవులలో నెక్కువ ప్రఖ్యాతి వహించినవారికి దీనిలో ప్రవేశము గల్గించు కృషి చేయబడినట్లు కానవచ్చుచున్నది.

పైన చెప్పబడిన విధమున యీ ప్రచురణము సమితి వారి ప్రయత్నములలో ప్రత్యేకలక్షణము కలది. దీనిలో దోసగులేవైన దూరియుండవచ్చును. అట్టివి కానవచ్చినచో సమితి వారి యుద్దేశము యొక్క యుత్కృష్టతను దృష్టిలో నుంచుకొని లోపములు క్షమార్హములుగా భావింపబడునని నమ్ముచున్నాను.

సాధనసమితియొక్క యువక కార్యకర్తల ప్రశంసించుచు, మనఃపూర్వక అభినందనములతో విరమింతును.

"ఆంధ్ర కుటీరము"<br>సుల్తానుబజారు, హై. ద.<br>౧౪ - ౭ - ౧౯౫౦ } మాడపాటి హనుమంతరావు.

# విషయసూచిక

# తెలంగాణా విముక్తి

(శ్రీ [illegible] నా "తెలంగాణోపాఖ్యాన"మనే కావ్యానికి ఇది [illegible] వ్రాసినది.)

అవి తెలంగాణలోన దావాగ్నిలేచి
చుట్టుముట్టిన భీకరాపత్తి దినాలు;
అవి నిజాము నృపాలుని అండ దండ
చూచుకొని నిక్కునిష్టి పిశాచి కలలు.

నాడు మానవతి నయనమ్ములందు
నాగసర్పాలు బుసగొట్టి నాట్యమాడె;
నాడు మానవతా నవ నాగరకత
తన్నుదిన్నది రాక్షసత్వమ్ముతోడ.

భారతి భామినీ నయనభాగ వినిర్గత రక్తబాష్ప పూరం
గారిత కాలరాక్షసి వికావిక నవ్విన నిస్వనమ్ములో
తూరుపు ఊరుపున్ విడిచి తొంచబడ్డవి తెల్లవారగా
ఘోర నిశా తమఃపటల గుంఫిత నీల నభఃపథమ్ములన్.

పంటు నిశాత ధారలను పచ్చనిగడ్డి యెదిర్చినట్లు, రా
చరికపు టుక్కుచట్టమును చల్లగ ధిక్కరణమ్మొనర్చె ఓ
స్సురినెడి పేదవాడు. కడుచోద్యము: వెచ్చని స్నానమాడె నిట
పరతరి భామినీ నయనధారల భారత మాతృపాదముల్.

[illegible]

తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైర భారతభూమి చూపడెనో లేదో
విషము గుప్పించినాడు, నొప్పించినాడు
మా నిజాంరాజు, జన్మజన్మాల బూజు.

భారత మాతృగర్భమున బల్లెము గ్రుచ్చిన దుండగీంద్రు కా
ఘోరముగా నిజాంనృపతి తాళముతీసిన పెద్దపెద్ద బం
గారపు బొక్కసాలు పసిగట్టెను తెల్లదళారి; అంతలో
చేరముసాగె పోరు జరిపింప తుపాకులు దింపుకోసమై.

కోటి తెలుంగు బొక్కమొగి "కో" యని పిల్చిన యంతలోనె ఆ
రాటముజెంది భారత ధరాతలమంతయు పొంగివచ్చెబో;
'కూటికిలేని పేదలకు గూడను పౌరుషమా!' యటంచు స్త్రీ
కోటిని మానభంగములకున్ గురిచేసిరి ముష్కరాధముల్,

చల్లని మంచుకొండలు భుజమ్మున మోసెడు భారతమ్ము తాం
తిల్లె నిజాము నీల్గడులు తేటపడంగలదాక; అంతలో
భోళ్ళున కుండ బ్రద్దలయిపోయెను; భారతమాత చొక్కలో
కుళ్ళిన పుండు కోసి జయగోపురమెక్కె త్రివర్ణ కేతనాల్.

దూరాన నున్న 'చుట్టము'
దూరాననె చూరె; తెల్లదొంగ నభస్సం
చారియయి పారె; స్వేచ్ఛా
భారతసైన్యంబు తలుపు బ్రద్దలుకొట్టెన్.

ఎదురెక్కియున్న జలములు
నదులై చొరబారె యింటినడుమన్; రాముం
డదనున బాణము వదలెను
పడ పడగెన్ మా ప్రభుత్వ మారీచునకున్.

రెండువందలయేండ్ల చరిత్ర గదుల
కప్పుకొని యున్న గాఢాంధకార మెల్ల
కొట్టుకొని పోయె తూరుపు మిట్టనుండి
పారి వచ్చిన వెలుతురు వాగులోన.



ఆ చల్లని సముద్రగర్భం
దాచిన బడబానల మెంతో ?
ఆ నల్లని ఆకాశంలో
కానరాని భానువు లెందరో ?

భూగోళం పుట్టుకకోసం
కూలిన సురగోళా లెన్నో ?
నర మానవరూపం కోసం
జరిగిన పరిణామా లెన్నో ?

ఒక రాజును గెలిపించుటలో
ఒరిగిన నరకంతా ఎంతో?
శ్రమజీవుల వచ్చి నెత్తురుతో
తాగని ధనవంతు లెందరో?

అన్నార్తుల అనాథలుండని
ఆ నవయుగ మందెంత దూరమో?
కరువం చా కాటకమంటూ
కనుపించని కాలా లెపుడో?

అణగారిన అగ్నిపర్వతం
కని పెంచిన "లావా" యెంతో?
ఆకలితో చచ్చే పేదల
శోకంలో కోపం యెంతో?

పసిపాపల నిదుర కనులలో
మురిసిన భవితవ్యం యెంతో?
గాయపడిన కవి గుండెల్లో
వ్రాయబడని కావ్యాలెన్నో?

కులమతముల సుడిగుండాలకు
బలిగాని పవిత్రు లెందరో?
భరతావని బలపరాక్రమం
చెర వీడే దినకెన్నాళ్ళకో?

# ప్రాగ్భూమి

పడమటి పొల్లి గద్దలు
పొడిచి పొడిచి తిని విడిచిన
అగ్నిసంస్కారం నోచని
నగ్నశవం ప్రాగ్భూమి.

మతాలతో గతాలతో
చితి రగిల్చి పడి చచ్చే
అస్పృశ్యమ్ముల చల్లని
కన్నతల్లి ప్రాగ్భూమి.

కడుపుల తెరి పాటున
మరణాంగ నాలింగనంతో
కను మూసిన నిరుపేదల
ప్రణయశాల ప్రాగ్భూమి.

తీగె విడిన దివ్యవీణ
మూగవడిన నాగస్వరం
కదలని వదలని అంతః
కలహపథం ప్రాగ్భూమి.

బూజెక్కిన కీలుబొమ్మ
రాజులపై జాజు పూసి

తాజాగా అమ్మిన అంగడి
దాజాలివి ప్రాగ్భూమి.

లక్షలాది పేదల ప్రాణాల్
అక్షింతలుగా చల్లుకొన్న
లక్షాధికార్ల పాలిటి
లక్ష్మిదేవి ప్రాగ్భూమి!

## కవితా కోపం

పాడను,
పాటలు పాడను;

వాడను
పదాలు వాడను;

వేడను,
వేపుళ్లను దయ్యాలను వేడను;

ఓడను,
రాజుకు, రారాజుకు
తారా రాజుకు ఓడను;

గోడను,
ధనవంతుల కనకసౌధ
మున కిటికీ వదిలే నిరుపేదల
అడుగు గుడిసె గోడను.

నన్ను చూచి ఎందుకో
మిన్నాగులు ఇట్లా
పారాడుతు జీరాడుతు
పిస్తుంటాయి ?

నన్ను చూచి ఎందుకో
పున్నాగులు ఇట్లా
తారాడుతు, గోరాడుతు
పొస్తుంటాయి ?

ఇది లోకం
నరలోకం
నరకంలో లోకం నరలోకం!

ఏనాడో తెలుసునాకు
అనిరీహా నీరవ
నిస్వార్థ నిష్ఠన
నీచ నీచ మానవునికి
విలువ నీడ లేదు జగతి.

లేదు లేదు విలువ లేదు,
చిత్తానికి ప్రాణానికి
శ్రమకూ సౌజన్యానికి
రచయితకూ శ్రామికునికి
రమణీ రమణీయ మణీ హృదయానికి
విలువ లేదు, విలువ లేదు.

నేనుగూడ వారి గూండానై
పుండుపడిన గుండెలతో
మొండిపడిన కండలతో
మొండిపడిన గుండెలలో
పుండుపడిన కండలతో
దౌష్ట్యం చేయాలేమో !
షాష్టంట్లనె దోచాలేమో !!

హిట్లర్నై
మార్టిన్ వేయాలేమో ! ఈ
ధనార్తినాథుల, పరపీడాకుల
నిరుపేద నిరంకుశ
నీరస నిస్తేజ లోకానికి
మార్టిన్ వేయాలేమో

ఫాలనేత్ర విలయాగ్ని మాలతో
నీలగాత్ర విషనగ్నకీలలతో !!

దాశరథి కృష్ణమాచార్యులు

# ఆరాధన

పసిపాప నవ్వులో - ప్రత్యూష రేఖలో
చిలుకమ్మ పలుకులో - తొగకొమ్మ పంపులో
చూలాలి నడకలో - చలి వెలుగు అడుగులో
కలతపడు హృదయాల - గర్భిణీ మేఘాల
తొంగలించెడి శక్తి - తొణుకులాడెడి శక్తి
కంజలిడుదు ;

తొలివాన చినుకులో - ప్రియురాలి పిలుపులో
పసిపైరు మిసమిలో - ముసినవ్వు కొసరులో
వరిపాల కంకిలో - సఖిపూల యెదదలో
బాలింత చేలలో - పసిపిల్ల పల్లలో
తొంగలించెడు శక్తి - తొణుకులాడెడు శక్తి
కంజలిడుదు ;

నడిప్రొద్దు ఎండలో - యవ్వనపు కండలో
ముదిప్రొద్దు మసుగులో - పండినా బ్రతుకులో
నడిరేయి కడుపులో - కసుమూయు బ్రతుకులో
తొంగలించెడు శక్తి - తొణుకులాడెడు శక్తి
కంజలిడుదు ;

గడ్డపారలకైన మొక్కపోవని
నల్లకొండలా గుండెలన్

ప్రత్యూష

చీల్చుకొని చిగురించు
తలిరాకు తీవలో

విసము గ్రక్కుచు నిక్కి బుసకొట్టి
నల్లత్రాచులా గుండెలన్ కరిగించి పూరించు
నాగుల్ల పాటలో
తొంగలించెడు శక్తి - తొణుకులాడెడి శక్తి
కంజలిడుదు.

## భిషక్కు

ఉషః సంధ్యల పండిన బంగారం
కరిగించక త్రాగిన
కాలానికి కడుపునొప్పి వచ్చింది;
నయంచేసే భిషక్కు ఏడీ ?
గానంచేసే రసజ్ఞుడేడీ ?

సామ్రాజ్యాల్ తెగమ్రింగిన
చాలెడు కడుపుల ఆకలి త్రాగిన
లోకానికి క్షయరోగం వచ్చింది;
నయంచేసే భిషక్కు ఏడీ ?
గానంచేసే రసజ్ఞు డేడీ ?

ముసలి బాటల మూల్గుచు నడిచే
సంఘానికి చత్వారం కలిగింది;
నయంచేసే భిషక్కు ఏడీ ?
గానంచేసే రసజ్ఞుడేడీ ?

# తెనుగు మొర

తేనెలు పిండే తెలంగాణము
నెత్తుట ముంచెత్తెదరా ?
తెప్పరిల్లిన, ఈ తెలంగాణము
కుత్తుక బట్టొత్తెదరా ?

తెనుగు తల్లుల పాలు త్రాగిన
ఓ నా తమ్ముల్లారా !
తెనుగు తల్లుల ఒడిలో పెరిగిన
ఓ నా అన్నల్లారా !
తేనెలు పిండే....
అటు చూడుడు అటు ! అటు
చూడుడు !!

కన్నులు విప్పి పరికనుడూ
తమ్మిపూల తురాయి పెట్టుక
తళ తళ లాడే తటాకలక్ష్మి

వెల వెల బోయిందీ—
అడవుల పొత్తై ఆలింగనలు
దొక్కలు తొల్చుక దిక్కు
మొగముతో
దిక్కులు చూసేనూ...
తేనెలు పిండే...
అటు చూడుడు అటు ! అటు
చూడుడు !!

కన్నులు విప్పి పరికనుడూ
మేడలు కూల్చిన మనకేమొరుగు ?
ఒకటికి రెండూ కట్టండోయ్—
అడవులు మనవే, నేల మనదే
ఒకటికి రెండూ కట్టండోయ్
తేనెలు పిండే...

పీకలు కోసీ ఇళ్లుదోచీ
ఏమది సాధించినదీ ?
ఒక పీకకు పదిపీకలు బలి —
ఒక ఇంటికి పది ఇళ్లూ మట్టం ...

తల్లికి బిడ్డా తండ్రికి కొడుకు
మగువకు మొగుడూ కనబడక

అధము శుభమెరుగ నమాయకపు
తెనుగు అలమటిస్తున్నారు—
తేనెలుపిండే తెలంగాణము
నెత్తుట ముంచెత్తెదరా?
తెప్పరిల్లిన ఈ తెలంగాణము
కుత్తుక బట్టొత్తెదరా?

## స్వాహా

అతడు పంటకు వచ్చిన పైరు —
ఆమె నీరు దిగని నీలం —

తను పెంచిన అవినీతికి
తను పంచిన పంచాగ్నికి
రగిలి రగిలి అగ్గియైనా దరిదు ---
ఆతని ఎదమంటల కాకకు
కళ తరిగి బొగ్గయిందామె —

కూలిన ఆ జంట బూది
విబూది పెట్టుకొని
మడి కట్టుకొని
సంగనాచీ లాగ
కొంగ జపం జేస్తు
కూరుచున్న దీ కపట లోకం —

ఎవని కళ్లు మూయుటకు? ఎవ
రెవని ఇల్లు దోచుటకు?

భాగి నారాయణమూర్తి.

# మహత్వాంక్ష

ఏచేయు పనిఏదొ నీవు చేయుము కాని
అన్యులను నీవేల అనుకరించెద వోయి?

ప్రత్యేకముగ నీవు
పట్టింపుతో చేయ
వలయు కార్యం బొకటి
కలదు ఈ భువి సఖుడ !
ఆ కార్య మిపుడప్ప
అన్యులతొ కాదోయి. ఏ॥

చిలుక పలుకులు పలుక
శృంగార మెవ్వరికి ?
నీ ఆత్మకే నీకు
నిండులేనిచొ యింక
ఏరి సంతృప్తి కిటు
ఈ ఆటలాడెదవు ? ఏ॥

అనుకరణలో మ్రగ్గి
ఆత్మజంపెద వేల ?
ఆత్మ వ్యక్తీకరణ
అదె సృష్టి పథమోయి. ఏ॥

ఒరుల దుస్తుల దాల్చి
ఊరేగుటలు పరవు !
రాజ రాజువు సరియె
రాజింపు నీకేది ! సీ||

మెఱమెచ్చులకు నీవు
మురిసిపోవగ దలచి
వెనుక ముందూ లేక
అనుకరింతువు ఒరుల !
మాయ, మోసం బెపుడు
ఇహా నిల్చునా హితుడ ? సీ||

పలుకుమని నిన్నెవరు
పాడుమని నిన్నెవరు
బ్రతిమిలాడిరి, హితుడ !
బలిమిచేసిరి సఖుడ !
పాడినదె పాడుటకు
ప్రళయ మింతేమిటికి ? సీ||

కోకిల పాటేదో
కోకిలయె పాడాలె
కాకి పాడిన నెటుల
కనుపించునో చెప్పు ? సీ||

పరుల గొప్పల పైని
భ్రమవదల నన్నాళ్ళు
నీ గొప్ప ఏమిటిదో
నీకు తెలియదు సఖా !

నీ పలుకు ఏదైన నీ పాట ఏదైన
నీ అంతరము నుండె నీటుగా రావలయు. పొ॥

# జీవితము

జీవచ్ఛవముగ ఏటికి
చిరకాలము బ్రతుకవలెను ?
ఒక్కగడియ చాలదోయి
ఉజ్జ్వలమగు జీవితమ్ము !

జీవించుట యనిననురిక
జీవించుట కాదెప్పుడు
జీవమె లేకున్న నద్ది
జీవన మెటులగునోయి ?

జీవము నీ జీవనముతో
చిందులాడవలెనన్న
జీవితమునె బిగనీవు
జేసి తీరవలెనోయి.

పిడికిలి బిగియించి నీవు
వేరుమాడ దలచినావ ?
మూల్యమివ్వకే జగతిని
ముట్టలేవు ఏవస్తువునైన !

నీకు వలయు వస్తుచయము
నిఖిలముయిట లభియించును
మూల్యము సిద్ధముచేయుట
ముందు నీదు కర్తవ్యము ;

కానయినను చేతలేక
కాసులెవ్వ డెవడుపొందె ?
గుప్పిగవ్వ కొనుటకైన
గుప్పిగవ్వ కావలయును !

పిడికిలి బిగియించినీవు
వేరుమాడలేవు ఎపుడు
నీ చేయి ఆడనిచో
ఏచేయి ఆడునిచట !

ఆశ్చర్యంబుగ జగతిని
ఆలోకన జేయ ఫలము.
శక్తి ఉన్న వేరుమాడు ;
వాలనిచో దయచేయుము.

పొట్లపల్లి రామారావు

# సారస్య పటిమ

గుమ్మ పాలల్లోని గోరెచ్చదనము
తమ్మితూడుల గ్రమ్మ తరలు సూత్తల్లు.
అరటి పూపులలోని అందంపు సిగ్గు
పరువెత్తు పిన లేడి బరువంపుశైలి.
బీరపూవుంవోలె విచ్చుభావాలు
కోరకంబులదాగు క్రొందేనెరుచులు,
వెలుగు కంటికి వెంట విడిపోనిజంట
వలపింపజేయు శబ్దార్థ వైచిత్రి.
జంటబాసిన గువ్వ సాగించురొదలు
పంటబోయిన రైతు పలవించురీతి
అంబాయనెడి లేగ ఆవేదనంబు
సంబోధనలకొత్త సారస్యపటిమ.
తొలికోడి కూతగా తోచుజ్ఞానంబు
వెలవారు చుక్కగా తీరించునాశ
మష్టుల పేగులే తోరంబులొప్ప
కష్టజీవులకునై గంగావతరణ.
అందరకు అందింటు మానంద మెపుదు
సుందరోద్యాన హృత్సుమ శీకరములు.

పులిజాల హనుమంతరావు

# మ ధు రో హ

నా శక్తిని విన్నారా!
నా బలమును గన్నారా!
నేనొక విషాదగీతిని
నేనొక విశుద్ధ హేతిని
నాదొక భయంకరాస్త్రం
నా కలమే బ్రహ్మాస్త్రం.

నా పాళీ కనురెప్పలు
పుర పుర పొక్కి పొక్కి
వొలికించిన సెలయేరుల
జలవాహిని
తరతరాల తరబడిగా
తలలను నిక్కించి లోన
చలనము రవంత లేక
సమాజ సౌందర్యానికి
సమాజ సౌభాగ్యానికి
దారులు నిర్మిస్తూంటే
దోవల కడ్డము నిలిచిన
కొండల ఛేదిస్తుందోయ్!
బండల కరిగిస్తుందోయ్!!

మండుటెండ వడ తాకున
ఎండి ఎండి జీవించుచు
పండుగయని,
వాడిన కోర్కెలు దొడగ
పీకిన యాసల దలచి
విల విల లాడుచు మూర్ఛ
పొలాల గుండెలు తడిపి
రాజనాలు పండిస్తుందోయ్!
భోజనాలు నిండిస్తుందోయ్!!

నా పాళీ వాతెరలో
రూపొందిన లేనగవులు
హవాయి చువ్వల్లాగా
వెన్నెల బాంబుల్లాగా
ఎగసి మెగసి పైకెగసి
వెలివెలుగుల జడివానలు
చిలికిస్తే
సమాజ సౌధాంగణమున
యుగయుగాల నాశ్రయించి
బిగిసి బిగిసి
బిరిసి బిరిసి
దిబ్బలుగా పాదుకొన్న
చీకటి దయ్యాలు కరిగి

నా కలం
నేడు
బలరాముని హలం;
తెలుగువారి పొలాలనడుమ
పిల్లకాల్వల తీర్చిదిద్ది
పసిడి బోదెలను బోసి
బంగారం పండిస్తుందోయ్ !
సాహస
శృంగారం సృష్టిస్తుందోయ్ !!

నే నెవరో
నన్నెరుగరు;
కవిని — కాను
గాయకుడను
పిచ్చి సంహారేమో-
అదిగో దిదిగాడు; నేను
మునిగిపోతాను !
మునిగిపోతాను !!

లోకాలను దాటిపోయి
ఆకాశపుటంచులలో
విహరిస్తా నొకసారి;
పేదపడిన జాలిగుండె

పొవలోనే నా పాటలు:
కాంప్ర గట్లను త్రెంచి
ఏంట్లో తిరుగుతాను
మాంట్లో మసలుతాను.

నే నొక
సుఖపోతాను
మఘపోతాను.

# ఆ క్షే ప ణ

వెదకి ప్రాణాంక్తై ఎసుగెత్తె, నీ జాడ
నెఱుగ నీ వెడుంటివో కదే ప్రియసఖీ!
కులుకు బంగరు కళల
పొలికించు తొలిప్రొద్దు
పడుచు మొగమునుజూచి
బ్రమసి పోయితి నీవు
నునుపు చెక్కిలి కొనల
దొనకు లేత గులాబి
నవకంపు క్రొంబూత
నాట్యమేమొ నటించు! ||వెదకి||

దవిలినంతనె లేచి

తడవికొందును నీదు

చెలువంపు ఓచేయుచు

పలికె నేమోయంచు. ||వెదకి||

ఈరేయి చలువ వె

న్నెలలో గుబాళించు

పూవు కన్నెల వలపు

తావులను కొల్లగొని

మెల్ల మెల్లగ దాటు

పిల్లగాడుపు మేన

సోకినంతనె నీవు

సోలి వ్రాలితివనుచు

చీకాకులో దిగ్భ్రమను

జెంది వెదకుదును. ||వెదకి||

పసరుబట్టిన మొలక

ప్రాయంపు చేలలో ,

వెస వెసకు నీ మేని
కొసరు టందాలకై
నిలువెల్ల కనులతో
నే వెదకి వేసరితి. ||వెదకి||

ఏ తెలుగు కన్నె కోయిల
కలుపు పాటనో ?

ఏ తెలుగు గొల్లపిల్లన
గ్రోవి యూపునసో ?

ఏ యడవి కోననో
ఏ మొయిలు నీడనో ?

ఏ పేద కన్నీటి
యేటి దరిదాపుననో ?

ఏ జాలిగుండె పరుగున డాగినావో
నీ వేడనుంటివో ? ||వెదకి||

ధవళా శ్రీనివాసరావు

# ప్రబోధము

సీ. ఆంధ్ర సామ్రాజ్య సింహాసనాలంబిత
విస్మయావహ మహా విక్రమంబు
సర్వజ్ఞ సింగమ క్ష్మాపాల సాహిత్య
పాండిత్య చిరయశః పాటవంబు
వివిధ దేశఖ్యాతి విలసిత "ఎల్లోరా
జంతాగుహా" శిల్ప సౌష్ఠవంబు
ఢిల్లీ సరత్రాణ ఖల్జాయి తాకిన
మంత్రీంద్ర ధీశక్తి మండనంబు

గీ. మంచి నడపినుగుంబోరె తిరుగు విన్న
వెలికి గొనివచ్చి వెలిగించు విజయదినము
వచ్చి యున్నది పూజింప వలయు లెమ్ము
మేలుకొమ్మోయి! ఆంధ్రుడా మేలుకొమ్ము.

సీ. పలికించినారు శత్రులు తల్లడంబంద
రత్తులపై వీర గాథలెల్ల
చిలికించినారు చంచల చిత్తులకు ప్రీతి
ముపనిషద్వాక్యపీయూషవృష్టి
వినిపించినారు దర్పిత పండితాళికి
వీరాంగ విజయ భేరీరవంబు

గజపతివారలు దాటి కలదు గుండియలకు
మందార మంజరీ మార్దవంబు

గీ. నింగి కెత్తించినారు నిచ్ఛిద్ర శౌర్య
సాహసౌదార్య వినయ రసాధ్వజంబు;
పూర్వ జాతీయ గౌరవాభ్యుదయమైన
దారిని నడుపు నిగింపవా తెలుగువాడ.

సీ. గ్రీకుల దాడికి చీకిన నీరితో
సకల విజ్ఞానంబు నమసిపోయె
పరమతా సహనంబు వాపిన బుద్ధిలో
వేద వేదాంతాల విలయమయ్యె
తురకలు గూర్చిన దుర్గాలతోపాటు
మతవిద్య శాస్త్రముల్ మంటగలసె
ఆంగ్లేయులార్పిన ఐకమత్యంబుతో
రాజ్యాంగ తంత్రంబు భ్రష్టమయ్యె

గీ. కొంప గాలినపిదప మొత్తుకొనుచునుండ
దొంగ బొరబడి దోచిన భంగినున్న
మన పరిస్థితి సరిజేసి కొనుటకైన
చేయిగల్పుడు ఆంధ్ర దేశీయులార.

గడియారం రామకృష్ణశర్మ

# ఋతుత్రయము

మానవ జీవితమ్ము మధు
        మాస వసంత మనోజ్ఞ శోభతో
పానలతో. మహాశిశి
        వాయువుతోడ ఋతుత్రయంబు పెన్
వానల బారినట్లు కల
        గా పులకమ్మయిపోయె పేదకున్
వానలు గొల్లగాను, చలి
        వాడలు సొచ్చు, వసంతముల్ తృటిన్

మానవులలోన ధనికుడు మాన్యుడగును
ఆకలికి రోయువాడు పుల్లాకుసుమ్ము!
అందు ప్రథముని జీవితమంత మధువె:
మొండివాన రెండవవాని గుండెలందు.

చైత్ర వైశాఖమాస వాసంతశోభ
ధనిక లోకంపు విశ్రాంత ధామమయ్యె;
శ్రవణాషాఢ నిబిడ వర్షానిపాత
మన్ను పేదకు మృత్యు ధామమ్మయయ్యె.

పర్వా జానకీదేవి

# స ఖ్యం

నీ లాస్యము పాయసమైతే !
నా ఆస్యము ప్రేయసమైతే !
నీ చూపు ద్విరేఫంబనగా,
నా దాపులు సఫలంబనగా,
ప్రేమ లతాంతమున వసింతాం !
దామ హృదంతమున రసింతాం !!

నీ మంజుల మంజీరందే
నా రంజిత కంజాతంబే,
నీ యానము నిట్టూరిస్తే
నా గానము లొట్టలువేస్తే
భావసుమాధ్వమున వసింతాం !
రావ మధూక్తమున రసింతాం !!

నీ శోభా ప్రాభాతంలో
నా స్వాభావా భూతంలో
నీ హృదయము మధురంబైతే,
నా పథకము విధురంబైతే,
ఆ శాసిత వసతి వసింతాం !
భాసాకృత విస్మృతి రసింతాం !!

నీ సుందర నిరాదృతందే
నా మందరకరా వృతందే,
నీ మనసొక నిచ్చెన వేయన్,
నా గుణమొక పచ్చన రాయన్,
భాగస్ఫురదంగముల వసింతాం!
రాగ తిరంగముల రసింతాం!!

నీ ప్రణయము నిస్తులమేమో!
నా అనునయ మతులందేమో!
నీ భావపు ప్రాభవమిల్లై,
నా భావికి లాభములల్లై,
సూనాంగణల లినివసింతాం!
ప్రాణంబుల కలిపి రసింతాం!!

నీ హసనము ప్రసవంబగులే!
నా రసనము అసదృశమౌలే!
నీ ఆడినగాత్రము పొగులన్
నా పాడిన గీతము రగులన్,
ఖ్యాతోపక్రమత వసింతాం!
జ్యోతిశ్చక్రమున రసింతాం!!

నీవే యొక మృదువాక్యమువై!
నేనే యొక మధుకావ్యమునై!

నీ విరహము నిర్వ్యాజముగా
నా దరహస మూర్వీజముగా,
శాస్త్రలలో రాపులసౌదాం !
రాపులలో పూపుల సౌదాం !!

నీ శిల్ప మహాన్యాసము నేపై,
నా అల్పవి పర్యాసము నీపై.
సీ భంగిమమే రంగులు గాగా,
నా యింగితమే పొంగులుబోగా,
చిత్రాకాశము చేరుపబోదాం !
యాత్రావేళల ...పముమాదాం !!

నీ హోపంబున నేపై తే !
నా భాషంబున నీవై తే !
నీవే కోకిల ముగ్ధవుగా,
నేనే హంస మయూరునిగా,
ఆ వసంతమున నాలాపిద్దాం !
ఆ వర్షంబున నాటల నాడ్దాం !!

నేనే నీవై, నీవే నేనై !
నీవని నేనని లేకుండా,
నిఖిల జగత్తున నిభృతులమై,
సఖుల వియత్తల కథకులమై,
దుఃఖలోకమును ఆశ్వాసిద్దాం !
సఖ్యజీవులుగ నిశ్వాసిద్దాం !!

# ఫాల్గుణ బహుళ అమావాస్య

" ఎందు కెందో యీ విశ్వము మండిపోవు
చున్నదో గాథ సొప్పి కాపన్నురార ! "
అనుచు కేకలు వినబడ నదరి లేచి
చూచినాను—

మోదుగు కొమ్మ జుట్టునింత
మండుచున్న మాలిని గట్టి మాయమైరి
ఎవ్వరో !

తేటి పిండులు ఎగసినట్లు
పొగలు గ్రమ్మెను !

నేలపై, పొట్టనంటి
పట్టుకున్న పుక్కటశిశు మాత వరెను
ఎవరుగని పల్కరించని వృద్ధ దేహ
ములు, దరిద్రభారమ్మును మోసికొనుచు
పోవుచున్నది పంటలో, పొగలలోకి
ఎందుకో ! ఎవ్వరో ! !

గుండెలు జల్లరించి కనుగోనలు మూసుకపోయె నాకు ! బ్ర
హ్మాండము పిక్కటిల్లినటులాయెను భావము వాక్కుకందకన్ !
దండిగ కొంతసేపటికి దాపున జూడక జూచినాను ఏ
కొండలలోనిదో ! పిచ్చి కోకిల రాగపురేఖ విన్పడెన్ ! !

ఆకలిదాధతో నపయుహార్ధ వృశోద్గళ భావ భారమే
దో కల నాదజీవిత మధూదయ దర్శనమయ్యె! తంబురా
తాకుచు జీర్ణసాగర కథాకళి నృత్యవు పొంగు. క్రుంగి పలకా
వ్యాకుల గీరిదాడె మరి వగ్గగు భిక్షకి నన్ను జూచుచున్!

"పండిన యాకు రే పగదిపడ్డవి చూచితిరేకదా! ఇకన్
మొండిగనున్న యా మదురు మొప్పులమాయుడు క్రొంజిపుళ్లనే
పంచుగజేయుడో ప్రజలు! భాగ్యవిహీనులు లేరు, పూలతో
దంచలు పండరాచు వసుధన్ సుభగా మధుభార దేల్చెడున్!"

అనుచునె వచ్చి దగ్గరిటి అర్థముకానిది పాట లెచ్చియో
వినుచుచునుంచె! నా మొగను పేడిమి గాడ్పులు వీచి దేహమె
ల్లను చిరుచెమ్మటల్ విసిరె! లజ్జ, భయంబును బుర్కరించె! సం
తసె కనుచుండగా, నొక లతాంగిగ గన్పదె మాఘ వీణతో!

ఆ సౌందర్య మహాః ప్రవాహమున నేమైనానొ! నా గుండెలో
దూసెన్ బోలును క్రొమ్మొడుటాకు, లిక వాదుల్ పేతు లో కోకిలా
శ్రీ సమ్మోహగళుల్! వియచ్చర ప్రవహ హంసీ పాప నాదామృత
ధ్యానన్ ఆశలు ప్రాకులాడి, భ్రమరీ ధమ్మిల్లమున్ గాంచితిన్!

శాంబా ప్రియసఖ్యా నీ రహస్య ముగ్ధాకృతి
లంపి. ఒదిగిచూచి పలుకరించె!
వీణమీద కరము విప్పారనేలేదు
పెదవి కదుపలేదు పృథివి మ్రోగె!!

" రమ్ము రమ్మోయి సఖుడా విరాగమేల !
విశ్వమంత వసంతము వినవొ—కనవొ ! !
ఋతు మహో షట్కచక్ర పరిభ్రమణము
తీరుగానె కాలము రూపు మారునోయి !

నీ గళాన రసము నింపెంతు నీవేళ !
నీ కరాన చిగురు నిలుపుదాన !
హిమ శిశిరపవార్చు తెగసిన విశ్వాన
భావ పుష్పవృష్టి పరపుమోయి ! "

అనుచు నెదురువచ్చి అలింగనంబున
ఎత్తినేమొ నా తలెత్తి చూడ
నిజమొ ! అనృతమేనా ! నే నమ్మలేనైతి
తెల్లవారుజాము తియ్యనికల ! !

వెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

# సెలయేరు

కనుమేర దూరాన
కనుపించు నాకోన

నల్లనౌ తల కొంత
నరసి పండినదేమొ !

నునుపుగాపడి నల్ల
నల్లనౌ తలమీద

తెల్ల మల్లురుమాలు
తీరేమొ కనుపించు !

మల్లుపాగాలోని
మలకలవి యొక కొన్ని

చెదరి గాలికి చాల
చెలరేగె ననిపించు !

కాదు, నల్లనిరాతి
కంబళంబున మీది

యేకిపోసిన రాశి
యేకమైనటులుండె !!

పైనున్న యారాశి
పాల సంభ్రమటంచు

నాగుబాములు కొన్ని
నడయాడునటులుండె

నెత్తిగాదది కొండ
నెత్తమ్మె యగు సుమ్మ

నరపుగాదది మంచు
తొరపు పరపగుగాని!

మల్లుపాగాగాదు,
మఱి చూదియునుగాదు

నడయాడు నిడుపాటి
నాగుబాములు కావు;

కొండ నెత్తముసుండి
రెండు మూడుగ జీలి

జల జల ప్రవహించు
సెలయేరు లగుగాని.

## 2

కొండపై వారెవరొ
వెండి గరగిన నీరు

కుండతో గుప్పుమని
కుమ్మరించిన భాతి,

స్వర్ధునీ వీచికల
జల్లులాడెడి కరుల్

తొండాలతో ముంచి
తూరుపెత్తినరీతి,

మంచుకొొలకుల తాన
మాడిలేచిన దివ్య

వారకామినియార్ద్ర
వసనాంచల మనంగ,

వేయికన్నుల తెప్ప
వేయకే సురరాజు

పదిలపరచెడి సుధా
భాండంబు చొరలెనన,

తళతళ త్తళతళ
త్తళతళత్కాంతితో

జలజలన్ జలజలన్
సెలయేరు ప్రవహించు,

**3**

ఉత్తుంగ శిఖరమ్ము
నుండి యటు పయనమై

ఆడాడ పల్లమ్ము
లందెగిరిపడి దూకి

మలకలై మెలివడుచు
మఱల విడివడి సుడులు
తిరుగుచును పొరలుచును
నురుగులయి పరుగిడుచు,

చండిగుండులుకొన్ని
పిండిగొట్టుచునంత
చెలరేగి గుంట్రాళ్ళ
చెండ్లాట లాడుచును,

పచ్చి పసుత్తైపు సేసఁ
బ్రాల జల్లులతోడ
తను తొంగిచూచు
నని పూజలను సలిపి,

సూర్యుడును చంద్రుడును
చుక్కలన్నియు గూడి
మోసులెత్తినక్రొత్త
మోహంపు మైకాన

పవలు రాత్రియు వెంట
పరుపులెత్తుచు నుంట
అందరను తనయందు
ఐక్యమొనరించుకొని

జలజలా జలజలా
జలజల ధ్వనులతో

తంపొలమ్ములలోకి
రాదూరె సెలయేరు.

4

సానువుల శిఖరాళి
తో నేకమొనరించి

ఆసు వోసినరీతి
పటు నిటుం దిరుగాడి,

పాదపప్రం గుండ,
పగిలి పారె ననంగ

మరకతపు పచ్చికల
మళ్ళలోపల దూరి,

నికటస్థలము రెల్ల
నిగనిగన్నిగలాడి

చూచువారల కనుల
దోచుకొనునటుచేసి,

పంటచేడియ ఆకు
పచ్చకోక పయంట

ముత్తెంపు జలతారు
మురువుపోతలుపోసి,

దోరపూవులు కొన్ని
దోసిళ్ళ గోసికొని

పరిమళము మైనిండ
పట్టించుకొని లేచి,

దారికడ్డుగనున్న
తరుల మూలము లొరసి

పక్వఫలముల పుడమి
పడ రాలగాగొట్టి

ఫలరసా స్వాదనకై
బలమెసక మెసకగా

పూల బొమ్మల నొడల్
భూషించుకొని మురిసి,

కలనాదముల నెదప
పులకితంబగు చుండ

వలువెనలు వెలుగ చిరు
నగవు చూపులు విసిరి

ఎందు చూచిననాని
యెదురెవ్వరును లేక

ఇచ్ఛా విహారమ్ము
నిటు కొంతతరి సలిపి,

చిటిపొటినడల హం
సిక వోరె నపుడేగి
చంద్రికాకాంతి, వా
సపసజ్జ పోలికను,

చెలిమితో ప్రకృతి, స
జ్జితము చేసిన మిసిమి
యిసుకపొన్పన విప్ప
శించె నా సెలయేరు.

## మామ

మామామ వచ్చిండు
మాకేమొ తెచ్చిండు,
మంచిము త్యాలివే
పంచుకొం డన్నాడు,

బొండుమల్లెలు కొంగు
నిండ విర చల్లిండు
దండ లల్లిన నల్లు
కొండుమీరన్నాడు.

పచ్చిపాల చెచ్చింది
పాలనే పోసింది,

ఎత్తుకో గలరేని
ఎత్తుకొండన్నాడు.

అమృతభాండము తెచ్చి
అటుకుపై నుంచింది

అందుకో గలరేని
అడ్డ మెవరన్నాడు.

పలుగురా కొండెక్కి
పగలబడి నవ్వింది,

పట్టుకో గలరేని
పట్టుకొండన్నాడు.

దొరవోలె వస్తాడు
దొంగవలె పోతాడు,

కనుమూసి తెఱచులో
కనపడడు మామామ.

ఎంచిచూడగ చాల
మంచివా డాతండు,

చల్లదనముల పుట్టె
నిల్లగుసు మామామ.

దొడ్డగుణముల వాడు
దొరతనము గలవాడు,

నలువెల్ల దిగమింగి
తెలుపులే వెదజల్లు.

మామామ కడుపులో
మచ్చగను పిస్తుంది.

లోకోపకారమై
చీకట్లు మింగిందో.

మామలకు మామ, తా
మా చంద మామ.

మామ మామకు మఱది
మా చందమామ!

పల్లా దుర్గయ్య

# అంజలి

ఉ. శ్రీ లలనామణిన్ గలిసి ప్రీతిగఁ గాపురముబ్బఁగాత మ
మ్మేలు తెలుంగు శారదకు; నెయ్యెడఁ గాంచిన దేశభాషలన్
మేలని కీర్తిన్ గనుచు మేదిని భాసిలు కన్నతల్లి మా
పాలిటి కల్పవల్లి సుతపాళి నివాళులఁజేసి చేయుతన్,

సీ. శాలివాహనరాజచంద్రులయేల్బడి
నిగ్గు దేరినపంటనేల యిద్ది;
చాళుక్యభూమీంద్రసపదసామజదాన
ధారలఁ దడిసినధరణి యిద్ది;
కాకతీయనృపాలఖడ్గధారల శత్రు
పంకముల్ విరిసినవసుధ యిద్ది;
విద్యానగరరాజవీరులశౌర్యోష్మ
రిపువనుల్ వాలిసిన పృథివియిద్ది;

గీ. సంస్కృతాంధ్రకవీంద్రులసరసకావ్య
వాహినులచేవ గొన్నట్టివసుధ యిద్ది;
సకలకకుబంతరాళవిశ్రాంత మైన
ఘనతెలంగాణమహిమ సామాన్య మౌనె?

-[illegible]

చ. పరిణతచిత్తముఁ గలిగి, పాపము లేనికృపారసంబునన్
బెరిఁగి, యమాయకత్వగుణపావను లై, పొరుగింటివారిమే
లరయుచు, నాత్మలో సుఖియుష్పయె పెన్నిధిగాఁ దలంచున
చ్చరితుల నీసుపుత్రుల విశాలవృశాయతిఁ బ్రోవు మమ్మరో!

ఉ. రాజన కైనఁగాని కవిరాజునకుఁ బుధరాజుకున్ పరి
వ్రాజకరాజుకున్ జననిపాదసపుష్పన పూర్వజన్మవి
భ్రాజదనేకపుణ్యపరిపాకముచే లభియించుఁ గాదె! త
త్పూజ లొనర్చి సర్వజనపూజ్యుఁడ వై విలసిల్లు మాంధ్రుఁడా!

చ. కవికులకోకిలాళి సహకారము లేక కడిందిఁ గుంది మా
ధవసహకారముల్ గని కృతార్థతఁ గావ్యకుహూరుతంబులన్
జెవిచవిఁ గూర్చుచుండ బుధశేఖరులార తెలుంగుశారదన్
దవిలి భజింపుఁ డయ్య! ప్రమదంబునఁ గావ్యసుమప్రజాంజలిన్.

శా. నిష్ఠాతృత్వము శబ్దతంత్రమున నిర్ణిద్రప్రభావాతిలో
చిష్ణుత్వంబును గావ్యమార్గమున నిస్సీమంబుగాఁ గన్నభ్రా
జిష్ణుల్ పండితసత్కవుల్ గల సభాక్షేత్రంబులన్ గూర్చి వ
ర్ధిష్ణుల్ సోదరులార! మీరు దృఢభక్తిన్ గొల్వుఁడీ! శారదన్.

క. ఒకజాతి కొక్కనాయక,
మొకహృదయం, బొక్కపూన్కి, యొకవిద్యయె నీ
యకలంకకృపాదృష్టిని
సకలాశాయశముఁ గూర్చి సాఁకుము తల్లీ!

మ. జయముల్ గూర్చుచుఁ దెల్గుతల్లికి; మహోత్సాహంబుతో సోదరుల్
క్రియ లెల్లన్ సమకూర్చుచున్; సుకవిరాట్కీర్తుల్ దిగంతంబులన్
"జయజై" యంచు నుతింపుచున్ నిలుపుఁడీ! సౌభ్రాత్రసంపత్స్ఫూర్తి
ప్రియ మొప్పారఁగ నాంధ్రభారతికి నర్పింపఁగా బ్రణామాంజలుల్.

క. రాజోత్తములకు, సత్కవి
రాజోత్తములకును, బుధరాజవరులకున్
భ్రాజితజననీభారతి
పూజకులకు నెల్ల నింపు పూజాకుసుమున్.

గీ. అరవిందరాకముగ నలరి మమ్ము
నాంధ్రసంస్కృతి జగమున నలముకొనుచు
మహితసంస్కృతులన్ వలమానికంబు
గాఁగ వెలిఁగెడు జ్జలు గనుము తల్లి !

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

# సృష్టి

ఇది మహాంబుధి; ఇందుఁగోపల
ఉపయమయ్యె; ఊర్మికలకిఁా
మొదలెఱుంగము; తుదియెఱుంగము
యెన్ని యుల్లోలంబులో
ఇక పుంపుటెట్టె
పెట్టి కల్లోలంబులో ?

ఈ మహోర్మ్ముల నెవడు లెక్కిడు
ఈ మహాంబుధి నెవ్వడీదును
యే మహాత్మ్ముండెఱుగ గలడిం
దే తుఫానులు బుట్టునో
మిన్నొలయఁటొంగి
యేమిటిని పడగొట్టునో ?

ఏ సురాసుర తీయనంత మ
హా సముద్రము నాసపెంపున
యే సరణి మథియింతురో యిం
దేమి యమృతము బుట్టునో
ప్రళయంకరంబగు
నెట్టిగరళం బుట్టునో ?

ఇందు శుక్తిక లెన్నియున్నవొ
ఇందు శైలము లెన్నియున్నవొ
ఎంచ బుద్ధతు లిది గ్రహింపగ
ఎంత యత్నము జేసిరో
ఫలమొందకుండా
ఎన్ని గోపుర మ్ముల వ్రాసిరో?

ఎన్ని జంతువు లిందు బుట్టెనో
యెన్ని చేపలు లిందుగిట్టెనో
యెన్ని తడవలు; ఎన్ని పడవలు
ఈ మహాంబుధి మునిగెనో
ఇంక ముందుముందూ
ఎన్ని మున్గగ నున్నవో?

గార్లపాటి రాఘవరెడ్డి

# సంక్రాంతి

చిరుతల కనువుగ చిందులు త్రొక్కుచు
పాటలు పాడుచు పరుగులు పెడుతూ
వాసరివచ్చి భెంగున వ్రాలాడూ
వేసము చూడా వేగము రారండి !

ఘపునేత్రి విగతానల జ్వాలలు లా
ప్రహారాహ ముఖగత జిహ్వాయిలా
ఘగఘగ మండే భోగిమంటలివి
శుభముల గూర్చగ గొలుతము రారండి!

ప్రతిఘలు పన్నిన దొడ్డవ్యూహంలా
పండుగ కన్నియ వప్పర్ల తళులా
వన్నెల పంపుల రంగవల్లులివి
కన్నుల పండువు నందగ రారండి !

వ్యూహములోపలి వీర శ్రేణులిలా
కృతులలోపలి అక్షరపంక్తులిలా
బారులుదీర్చిన గొబ్బి వేపర్లవి
భక్తితో కొలుతము బిరబిర రారండి!

పంటలొంటొంటి పల్కరించు కో
వెంటనంటి నడయాడునట్లుగా
పరువముగూర్చే 'పాలవెల్లి' యిది
మురిపెముదీరా చూతము రారండి !

చిరునవ్వు పాలబుగ్గలన్ దొరలాడ
సురుసిగ్గు కనుదోయి దోబూచులాడ
కన్నెపడతులా వెన్నజీవితాల్
పున్నెము పండయా దీవింతుము రారండి.

## శారద

ఆంధ్ర శారదనీకు అక్షరాంజలులూ
అందుకో ఆదుకో రావమ్మ మాయమ్మ!

తరతరాల్ మాయింట తాండవించిన పంట
వలపు తరగనివెల్లి తళుకు బెళుకుల తల్లి!
తెలుగు నేలంపైన తేనె మాగాణి నీ
తీయగా తేటగా తీర్చి దిద్దిన తల్లి!
పదకవితా సుదతికి మధురగాన ఫణితులా
మురిపముతో ముద్దుగా చదువ నేర్పిన తల్లి!
ప్రబంధ సుందరీ పసబంధుర భంగిమలా
ప్రభలతో ప్రబలగా ప్రబోధించిన తల్లి!
నవకవితా యువతీ భావాభినయ గతుల
శిల్పములా లీలలన్ హావణించిన తల్లి!
ప్రణయ రాగములోన ప్రణవ నాదమునింప
ప్రవిమలమోగ నియతి ప్రసాదించెడి తల్లి! ॥ఆంధ్ర॥

పిల్లలమఱ్ఱి హనుమంతరావు

# అడుగుజాడలు

కాంచి కాంచిన కనులు
కనుమేర దాటంగ
కనుపాపలను తెప్ప
కదిలించి వేసింది.
కలయిగానివిగాధలూ
చెలియరో
కాలప్పుర్లో గర్పనే.

లోకాల హింసల్లో
లొంగి లొంగిపోయి
ఆలోకనముకైన
ఆరాటపడ తుదికి
అదియు కరువైపోయెనే
సఖియరో
ఆర్తి నేరికి చెల్పనే?

సిగలో పూచెడి తేనే
సిరులొల్కు చూపుల్ల
నాకంట బడకున్న
నిలుపవే కా లొకట
అడుగుజాడలె మిగిలెనే
నారాణి!
అడవిబ్రతుకై పోయెనే,

అడ్లూరి అయోధ్యరామయ్య

# పువ్వా!

వాసంతవీధుల్లొ వయ్యార మొలికించి
పైరగాలుల్లోన పారవశ్యముజేసి
వడగాడ్పులకు నీవు వాడిపొయ్యావా ?
పువ్వా ! వాడిపొయ్యావా ?

సూర్యుచే దండెత్తి చుట్టివేసేవేళ
ఆకాశమందుండి అగ్ని గురియుచునుండ
మండుటెండల కీవు మాడిపొయ్యావా ?
పువ్వా ! మాడిపొయ్యావా ?

కాళరాత్రుల్లోన కాటుప్రబ్బులక్రింద
ఉఱుము మెరుపులమధ్య ఉక్కిరిబిక్కిరై
ప్రళయవర్షానికే రాలిపొయ్యావా ?
పువ్వా ! రాలిపొయ్యావా ?

ప్రీతిమాలికవయ్యి నాతిచేతులగుండ
నాథుమెడలో వెలసి నాట్యాలు తెగజేసి
నవ్యజంటలమధ్య నలిగిపొయ్యావా
పువ్వా ! నలిగిపొయ్యావా ?

బలివెట్టగా నిన్ను బలవంతముగ కోసి
స్వార్థమానవులంత స్వామిపూజలు సేయ
దేహమే యర్పించి ధన్యవయ్యావా
పువ్వా ! ధన్యవయ్యావా ?

శవముమెడలో నీవు శిశువుచేతిలో నీవు
వధువుతలలో నీవు వరునిహృదిపై నీవు
పరుల కష్టసుఖాలు పంచుకొన్నావా ?
పువ్వా ! పంచుకొన్నావా ?

# చందమామ

ఎన్నాళ్లకొచ్చావు ఓ చందమామా
ఎక్కడా దాగావు నా చిన్నిమామా !

చీకట్లు నినుజూచి సిగ్గుజెందాయి
చక్ర వాకాలన్ని చెలరేగినాయి.

నల్ల కలువలపూలు కళ్హార వికసించె
మల్లె 'రాతిరి రాణి' పరిమళం ప్రసరించె

అద్దంలో మా చిట్టి ఆడుకొను నీతో
ముద్దుగా పల్కును ముచ్చట్లు నీతో

నీ ఇల్లు వాకిలీ ఎక్కడున్నాదీ
నీ తల్లిదండ్రెవరు చెప్పవే మామా ?

పిల్ల తల్లులు నిన్ను పిల్చినా ఎప్పుడూ
పారిపోతుంటావు నా దొంగమామా !!

మూటుపురి వెంకటేశ్వరరావు

# గౌరి

పున్నెములందు సద్రచనబొందిన యీ పరమ వ్రతంబులో
బన్నిన కంకణమ్ము కర పంకజమందలరార భక్తి సం
పన్నత నారితేరిన యుమాసమలన్ పదమంటి మ్రొక్కిన
య్యన్నులమిన్న లాడెడు ప్రియంబులు చెల్లియ నిన్నునోముతన్.

ఎవ్వరు నేర్పిరే చెలియ యీ గతి వాయనమిచ్చి పల్కనీ
నవ్విన నవ్వులో తెనుగు నాటి మనోహరకీర్తి వల్లికల్
పువ్వులు పూచెనమ్మ నరపుంగవుడౌ పతి నెమ్మనంబులో
గ్రువ్విన భావముల్ వెలికి గూర్చినవే నునుసిగ్గు దొంతరల్;

కౌసల మరల్చివేసినది క్రొమ్ముడి నూతన ధూప సౌరభ
ప్రసర సువాసితమ్మనయి వ్రాలెను వెన్నుననంటి దీర్ఘమై
ప్రసవచయమ్మునందు పరిభాగమునందెటు నిల్చితమ్మ! యీ
పస విదులించుకొన్న పతిభాగ్యము నేమని ప్రస్తుతించెదన్.

ఆచారమ్ము లలంకృతమ్ములు; స్తుతివ్యాపారముల్ నేటివా
ప్రాచీనంబులు నిండికొన్నవి సమారబ్ధ వ్రతంబందు నో
హో చైతన్య కళాస్వరూపిణి! త్రిలింగోర్వీ సుమారామముల్
బూచెన్గా మధురాననేందు మధు సంపూర్ణ ప్రవాహంబునన్.

సోమరాజు ఇందుమతీదేవి

# హితోక్తి

పువ్వులపైని నిప్పులను బోయుటకేనియు. మల్లెతీవకుఙా
గ్రొవ్విన కాఱుదున్న జతగూర్చుటకేనియు గున్నమావులన్
మవ్వము దూలిపో సెగల మాడ్చుటకేనియు సాహసించి యీ
పువ్వులతోటనే నఱుకఁబూనిరి కొందఱు మూఢ మానవుల్.

ఒక సీతమ్మను దాకు పాపము జటాయు క్రోధమై, వానర
ప్రకరంబై హనుమన్నిదాఘ దహనజ్వాలాళియై, రాము సా
యకమై కూల్చె సమూలఘాతముగ దేవారాతిఁ బౌలస్త్యునే
డొకటీ రెండునుగావు స్త్రీలకగు నాయుర్మానభంగ క్రియల్.

పాలబుగ్గల శిశువ్రాతంబు మంటల
బడి 'చుంయి' మనికాలు నెదరుపాటు.
కాళ్ళపారాణి బుగ్గల కాటుకయు మాయ
నవదంపతులు కత్తి నఱుకబడుట,
పూచిన తీవియబోలు ముత్తయిదువఙా
సిగబట్టి యీడ్చు దుండగులదాడి,
కాటికి కాల్సాచి కదలని ముదివగ్గు
మంట మూటగనైన మడిసిచనుట,

యనెడి ఘోరాతిఘోర కృత్యంబులెల్ల
ప్రజల స్వాతంత్ర్యలాభ సంపదనెపాన
న్యాయమొల్లని మతమహోన్మాదచిత్త
లేకఘాటిగ సలిపినవేగదయ్య !

నవఖాళీ రుధిరస్రవంతులకుఁ జింతన్ క్రుగ్గి, పంజాబు ఘో
ర విపత్తుఁ భరియింపలేక, వివిధప్రాంతోగ్ర సంఘర్షణల్
చెవులఁ జీముఁగట్ట, దుండగులకాశ్మీరోగ్రధాటిఁ పరా
భవశంకఁ బడు భారతావనిఁ దలంపన్ గుండె నీరయ్యెడిన్.

ఎన్నోఘోరము లెన్నోకష్టములతో నీనాడు స్వాతంత్ర్య సం
పన్నంబైనది భారతంబు; మరలన్ బ్రత్యగ్ర సిద్ధాంతముల్,
సన్నాహంబులు, భావభేదములు, స్వేచ్ఛావృత్తు, లుద్రేకముల్
పన్నాగంబులురేపి శాంతిసుఖముల్ భంజింపకోయీ! సఖా!

నాగలితోడిదే జగమనం గృషిసల్పెడు రైతుబిడ్డలున్
భోగములెట్టివో ! మధురభోజనమెట్టిదొ ! కానకున్న యా
త్యాగులు కార్మికుల్ చెడుగుదారులబట్టి నశించిపోవ నే
వో! గునిపూడిజంగముల యూహలుపన్నకుమోయి! మిత్రమా!

కేశవపంతుల నరసింహశాస్త్రి

# తెనుగు తల్లి

సీ. పరిపూర్ణ పావనాంభ స్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు;
ఆలంపురీ నందనారామ విభ్రాజి
మల్గోబఫలరాజ మధురరుచికి;
ఆంధ్రీ కుమారీ సమాయుక్త పరిపూత
తుంగా పయస్సు పూఘుర్య మునకు :
ఖండశర్కర, జాతి, ఖర్జూర, గోక్షీర,
ద్రాక్షాదియుత రామరస మునకును;

అమృత నిష్యందివల్ల కీహ్లాదమునకు;
రాగిణీ దివ్యసమ్మోహ రాగమునకు ;
తేనెతేటల నవకంపు సోనలకును ;
సాటియగును మాతెనుగు భాషామతల్లి.

# మిత్రుడా!

కొండవీటిని కోటలమరిచి
దండివీరులు తాండవింపగ
చండవీర్యము నిండియుంచిన
తెనుగుభూమిది మిత్రుడా!

శాయనార్యుని సాకిపెంచిన
ధీయుతుండగు తిమ్మరుసుపును
బాయకుండగ ప్రబలజేసిన
తెనుగుభూమిది క్షేత్రుడా!

నవరసమ్ముల నాదమొప్పగ
చెవులుసోకగ కవనమల్లిన
కవులుముగ్గురు కల్గియుండిన
తెనుగుభూమిది మిత్రుడా !

వేమనార్యు వివేకమహిమను
సోమనాథుని సూక్తియుక్తిని
రామలింగని రమ్యచరితను
గన్నభూమిది మిత్రుడా !

దత్తమండలి ధైర్యపటిమయు
నుత్తరాంధ్రుల యుచితచర్యలు
నుత్తమంబుగ నొప్పియుండెడు
తెనుగుభూమిది మిత్రుడా !

ఆయుధంబుల ఛాయబెరిగిన
కాయబలమున గడలుగెలిచిన
వేయివిధముల పేరుబొందిన
యాంధ్రయోధుల బొగడుమా !

తేటమాటల తేనెలొలుకుచు
పాటవంబున బరుషమొప్పచు
సాటిబాసల నీటుమీరెడు
నాంధ్రభాషను బొగడుమా.

సురవరము ప్రతాపరెడ్డి

# తెనుగుతోట

తెలుగు తోటలలోన - తెలుగు వన్నెలు లేవు
శోభనిచ్చే దెన్నడో ?
తోటంత
సొగసు గులికే దెన్నడో ?

అల్లు పందిరిలోన - ఆటలాడెడు తీవె
పడగ లెత్తే దెన్నడో ?
తోటంత
పైకి ప్రాకే దెన్నడో ?

అందాలు జిలుకుచు - ఆకుమరుగున జేరి
మొగ్గ తొడిగే దెన్నడో ?
తోటంత
సిగ్గు జిలుకే దెన్నడో ?

పసరు తీవెలలోన - పసిడి పిందెలుపడీ
పండ్లు పండే దెన్నడో ?
తోటంత
పరువు కొచ్చే దెన్నడో ?

గాలి తాకుడులకు - కదలి ఉయ్యలలూగి
జోల బాడే దెన్నడో ?
తోటంత
సొంపు లొలికే దెన్నడో ?

# ఎందులకో

నందన వీధికలందు
చందన వాయువులందు
నందించును; నవసౌరభ
మందించును; ఎవ్వరికో?
ఎవ్వరికో? ఎందులకో?
ఎందులకో నా హృదయం?

వెన్నెల క్రొన్నెల యగుచు
చిన్నని కిన్నెర యగుచు
చిలికించును సుధానిధిని;
పలికించును నభో ఘనిని;
ఎవ్వరికై? ఎందులకై?
ఎందులకో నా హృదయం?

భ్రమరీ వ్యాఘాత సుమిత
రమణీయ నికుంజ గోధ
గమనించుచు గమనించుచు
గమకించును విషాద గీతి;
ప్రవహించును బాష్పరీతి;
ఏ యెడకో? ఏ కడకో?
ఎందులకో నా హృదయం?

పరిహాష

నూత్నసంపుల్ల మన్మనోంబుజదళా_న్త
రిములనానందమధురి మరందమీవు
మాధురీభావ సురభి సంపదవు నీవు;
స్వాంత మేనీవు జీవిత స్వాదుసరసి
కలసుధాపూర మీవు నా.గానమీవు.

నీదు కడగంటిచూపు వెన్నెలలతోడ
ఈయమేయప్రసన్న విహాయసంపు
సరళ వీధులలో మనశ్చంద్రు డిటులె
పెరిగిపోనిమ్ము చిన్ముద్ర కరణినింక
రథమునడిపించు ఆశీర రథములందు.

# స్వప్న సుందరి

కాటుకనీలిరేకల నిగారపుకాన్గిలను చూపుతోడ స
య్యాటలనాడు లేనగవుటందపుమోకల నేలనాహృదిన్
మీటెదు చిన్నికిన్నెరను మీటినరీతి మనోహరీ? ఎదో
దాటిననాటి స్వాప్నిక కథాగతులన్ బలికింపబోకుమా!

కన్నులుమూసిలోనగనగా కనుపించు స్మితించు నీదు దీ
వ్యన్నవమూర్తి నాహృదయ పద్మమునన్ వరపద్మయై, రసా
భ్యున్నత భావడోలికల నూగుచునూగుచు దేలిపోవ, నా
కన్నులు విచ్చిహెచ్చు తమకంబున అశ్రులురాలుజాలుగా.

సీ॥ భార్గవ ~~~~~~~~~~~~~~~~~~~~~ ★

మారిపుమేరదోచియును తోచనిఆయుచలాగ్రమందు, మం
దారపుతోటవాకిట సదా ప్రవహించు ఝరీమృదూగ్మి మా
లారివమేళితస్వర కరస్థవినోద విపంచిపై, లయ
స్ఫారమనోజ్ఞగీతికలు పాడెదవే ఎదవేగిపోవగన్.

ఆడెదవొక్కసారి నభిముందున జక్కదనాలచుక్కవై
పాడెదవేదియో హృదయభారముడిగ్గ అమర్త్యకన్యలన్
గూడిచరింతునందనము కోనలబూవుల సోనలందు దూ
గాడుచు నింపుకొందువు మనంబున మోవ నిలింపసంపదన్

తొలిరేవెన్నెల పాలకోనెరున ము
ద్దులొమీర నీ వేనునున్
జలకంబాడిననాటిమై పులక లిం
కన్దోచు క్రొంగ్రొత్తలై.
తొలగంబోవదు ఆరమూప్రతిమ క
న్దోయిన్ దిగన్జారు కా
ల్వలలోనన్ బ్రతిబింబితంబు నగుచున్
లాలించెడిన్ డెందమున్.

కలయైపోయిననాటి జీవితసుధా
కాంక్ష ప్రపంచంబు నిం
దలి యందాల గులాబిపూబొదలు, మం
దానంద వాయూర్మికల్,

వశీభూష ~~~~~~~~~~~~~~~~~~~~~

పల్లవుంగావి పసంపు సంజలును. లీ
లా వేణు సంరావముల్
తలపోయఁగా ఒకచిత్ర చిత్రితములై
తాకెన్ మనోదృష్టికిన్.

వినవచ్చుఁగా మృదురీతి నిష్ఠరవనీ
విద్యాధరీ కిన్నరా
క్వణనంబుల్. కనవచ్చు త్రుళ్ళిపడు గం
గాలింగమూర్మి ప్రభే
లన హేలానవడోలలఁగా గదలు చం
ద్రదస్మేర మందారముల్
కనులఁగా మూసిగతాను ఘాతుల సమీ
క్షల్ సేయనౌక్కొక్కచో.

కాటుకచీకటిం బొగలు
గ్రక్కుఘనాఘన పంక్తులందు నీ
వేటికి దూరినావు - తపి
యింతువు - తీరని విప్రయోగ దుః
ఖాటవులందు గ్రుందు హృద
యంబువలెఁగా - శమియింపమేని ఆ
రాటమునాదు బాష్పఝరు
లఁగా జలకంబులు ఆడిపోగదే.

సిరిప్రగడ భార్గవరావు

# నీ రాక

నీవురావాలన్న మమతే
నీవువస్తావన్న మురుపై
బ్రతుకు కిన్నెరభావ మూర్ఛన
లోలికి పోయినదీ.

నీపువస్తావన్న మురుపున
నీవెవరవో పోల్చుకుంటూ
జీవతూలిక తీవవెన్నెల
సొంపు లొంపినదీ.

నీవురావాలన్న వలపే
తలపుతేనియ భరముమోస్తూ
విరహగేయ దివ్యప్రసూనా
వళుల నల్లినదీ.

నీవెవచ్చేవన్న మురుపున
బ్రతుకుతమ్మినియాసముత్తెము
లోలికి నిలువున నులుకుతూ సె
ర్లిల్లి పోయినదీ.

ఊరికావలి మావి తోపున
దారిగాచిన పిల్లకోయిల
నిన్నుపోల్చుకు "మేలుకో"మ్మని
యూల వేసినదీ;

వీథి పందిట కన్నె పల్లియ
"వచ్చెలే!
పంటలు పండె నె!"మ్మని చిలిపిపాటున
కన్ను గిలికినదీ;

సందడిలో సంపడిగ యౌవను
మాడుచూ పాడుచు ముగ్ధ —
ప్రణయి నూరార్చుచూ మోవిని
అంటిపోయినదీ

... ... ...

రాకలో రంగిలిన నే నీ
రాకలోనే మైమరుస్తే
సేకరించిన సొంపు సంపద
నీ కొనర్చె దెవ్వరో ! !

జమ్మలమడక సూర్య ప్రకాశరావు

# మాయ

ఇదియేమొ యెవరైన నెరుగంగజేయరా?
ఇటులున్న నా బాధ నెటులైన బాపరా?

దీని నీడలు నిండు దిశదిశాంతములందు
అన్ని యెల్లలుదాటి యంతటన్ ప్రసరించు;
ఆ నీడ ఛాయలన్ విశ్వమంతయుగూడ
ఒకరీతి మదితోచు నొకరీతి కనుపించు ||ఇది||

ఔనన్నవాటిని అద్దికాదని చెప్పు
కాదన్నవాటిని కనుపింపజేయును;
ఒకసారి నొకదాని నొకరీతి జూపించు
మరుసారి దానినే మార్చి జూపించును ||ఇది||

కనుల గ్రమ్మినవేమొ కారుచీకటులల్ల
కనుపింపదేమియు, కనలేను నిజమును;
ఏమున్నదీ వెనుక నేమున్నదోయీ?
తెలియజాలక నేను విలపించుచుంటి.

ఇదియేమొ యెవరైన నెరుగంగజేయరా?
ఇటులున్న నా బాధ నెటులైన బాపరా?

సన్నిధానం శ్రీధరశర్మ

# ఆ యా ది

ఆయాది నాకిపుడు హాలాహలంబయ్యె
లోకమే చీకటిలో లోపించె నాకు
శోకమే నలుదిశల శ్రుతియించెనాకు!

నన్ను నే చూసుకొని నిన్నే తలచుకొని
నిన్ను చూసినవాలు అన్నీ మరచిపోయి
'నీవు నాతో వుంటె నాపులేవాసుయుంచె ||ఆ||

పసవాహినులుపారు గుసగుసల యాది
కొసరి కొసరీ నవ్వ విసరు పువ్వుల యాది
రాగనిభృతమైన త్యాగాల యాది ||ఆ||

పాల్బూపు జాలులో పోల్చుకోలేనట్టి
కన్గోన లంచూరు కమ్మనీ మధువులు
కాలాహి విషయమునే కరగించు యాది ||ఆ||

మల్లెపందిరిక్రింద నీవల్లి వేసిన ప్రేమ
పిల్లకాల్వల కెలన నే కొల్లగొట్టిన ప్రేమ
దేవాలయంబులో దీక్షబూనిన యాది ||ఆ||

అద్దములో మన ప్రతిమ లాడుకొను యాది
నిద్దురోయినగాని వద్దన్నగాని
ముద్దులొలికిన ప్రేమ యుద్ధాల యాది ||ఆ||

ఆయాది నాకిపుడు హాలాహలంబయ్యె
లోకమే చీకటిలో లోపించె నాకు
శోకమే నలుదిశల శ్రుతియించెనాకు!

బూర్గుల రంగనాథరావు

# భానురథము

ఉదయంబందుము భాస్కరా! కరసహస్రోన్మేషముప్పొంగ నీ
సదయాకారము గాంచ వేడ్క సరసీజాతంబులున్ మానవుల్
నదులుం బర్వతముల్ వనంబు భువియున్ నానా మహాజీవులున్
ఎదురుం జూపుల జూచుచుండ్రు. ప్రభురాకన్ వేచు సప్త్యర్ బదెన్.

వాటెడు మాయయంచు బిగబట్టితి వెందుకు నాటి సంపదల్
మూలములేని యాతనపు ద్రోలల మగ్గముపైచి చిత్రపా
కాలపు తెల్లతాను కడకమ్ములు లేకయె నేయనేయమే
మోపని దానిగోల్పుకొన నొప్పును మూర్ఖుడు మూరబిట్టె మై!

ముసలి యెద్దుసులేపి ఎసపాగ సవరించి
కట్టుపై చేయిడి కప్పికుందు;
పెంటితో ప్రియమాడి పిల్లలముద్దాడి
మేతల కరుగంగ పోతుపక్షి;
'ఇంతయే ప్రాప్తిరో! నాటి కంచును
తడబడి పరువెత్తు తస్కరుండు;
ఉచ్చైంత మంత్రంబు నుచ్చరించుచు
నర్ఘ్య మర్పింప నిల్చిన యాహితాగ్ని;

ప్రియుని కౌగిలి విడలేక బిడియపడుచు
నత్తవారింట మెలగెడి క్రొత్తపడుచు

అలికింతురు చెవియొగ్గ యలతియలతి
బంధురధ్వానమునవచ్చు ఘనురథము.

స్వామి ! పల్వురు శిష్యవర్గముల కాచార్యుండవై నీవు ఛం
దో మీమాంసలు నల్పుచుందువటగా ఓంకారముల్ నల్పి వా
దే మోహించు ధరిత్రి విద్యలను నేడీ ప్రాక్తనాచారముల్
సామర్థ్యంబులుసున్న, దాశషములై శాస్త్రంబులున్ జెల్లెడిన్||

ఆముదమా ఖరీదు; చమురా చమురాయెను; సీమనూనియల్
ఖాసల ప్రౌయ్యిమంటలకు చాలెదనంతయు లేవు, వహ్నులన్
దాచును చప్పచల్లవడె దారిదరి ప్రతిజెంచి, వైద్యుతం
బాముసు పంతరోలవదె నక్కట దీపము లోపమయ్యెనే!

లో వెలుగెన్నడో మనుజలోకపు టంచుల లుప్తమయ్యె, పై
పైవెలుగైన చీకటుల బంధురతాండవ మద్దగించునం
చీవర కూడిల్ల గలయించెను గొంతెమ కోర్కెయై, మమ
ష్యావళి బాహిరంబునను అంతరమందున గ్రుడ్డియౌనకో?

మానవు దర్శనిర్మితిని మ్రాన్పడజేయును విశ్వకర్మనిన్
ఛీనుత సంపదన్ గెలుచు దేవ పురోహితుగూడనైన నా
పామగుడైనయట్లు కలియంతయు నేలకు నమ్మసేసి తా
దీనత నాకటంబడునె, దీపమునైనను నోచుగాకో ?

అదుగో వార్ధపురి కుటీరమున
భవ్యంబైన తేజంబు; అ
య్యది కార్చిచ్చునుకాదు,
మందకొాడి చంద్రాంశు ప్రభల్ కావు, కా
ల్వెమముట్టంజన,
జ్ఞానతీక్ష్ణమగు నార్పంజూచునా దివ్వియల్
పదివేల్ హస్తములారునే
హృదయ దివ్యస్నేహ దీపావళుల్?

నాకేకావలె, నేనయేలుదను పంతంబుల్
వృథాలాపముల్;
నాకింతైననుజాలు,
నామిగులులో నా సోదరా నీవునుల్
స్వీకారంబులు సల్పవయ్య;
ఘనమా జీవంబు స్వార్థంబుకై
ఘాకల్యాణములొక్కచేత నగునే
పొందైన మేల్కాకో!

ఖండవల్లి లక్ష్మీరంజనం

# పిల్లలమండీ పిల్లలమూ!

పిల్లలమండీ—
పిల్లలమూ!
తలంపు నిచ్చేన
తలోటి తెచ్చి
ఎక్కేదమూ!—పై
కెక్కేదమూ!
ఆకాశంలో
మకాము వేసి
చందమామతో
పందెము వేసి
నవ్వేదమూ!
నవ్వించెదమూ!
—పిల్లలమండీ, పిల్లలమూ!

తారకలతో
తారంగం
మెరుగుబాలతో
పసుగుడు పందెం
గడగడ ఉరుముతో
గుడుగుడు గుంచెం
తెప్పలమాటున
దాగుడుమూత
ఆడెదమూ;
ఓడించెదమూ!
—పిల్లలమండీ, పిల్లలమూ!

ఇంద్రధనువుతో
వుంగిడిపూసే
మంచు ముత్తెముల
సంచుల నింపుతు
వానచేరులను
పట్టుక కిందికి
పాకెదమూ!
పాకించెదమూ!
—పిల్లలమండీ, పిల్లలమూ!!

# మా ప్రణయం !

పెరిగిపోయిన
పూసల పేరూ
చితికిపోయిన
గాజుల జోడూ
చినిగిపోయిన
చీరలకొంగూ
మా ప్రణయం రా
మా ప్రణయం !

... ... ...

వాడిపోయిన
పూవుల దండ
పొంగిపోయిన
పాల మీగడ
తవ్వమాడిన
చల్లపేరుపూ
మా ప్రణయంరా
మా ప్రణయం !

... ... ...

ఆగిపోయిన
కట్టుకాలువ
నిలిచిపోయిన
మడుగులనీరు
ఆకులు రాలిన
తీగలతీరు
మా ప్రణయం రా
మా ప్రణయం!

... ... ....

వెలిగిపోయిన
వెచ్చనికౌడలు
లేచిపోయిన
ఆవిరితెప్ప
మా ప్రణయం రా
మా ప్రణయం!!

వెళ్ళి త్రి

# ముళ్ళు

తన్నుతా మరచింది
దారియే తప్పింది;
నా చూపులో చూపు
నాటుటకు చూచింది;

ముల్లుపై అరికాలు
మోపింది మైమరచి
"అల్లామరీ" అంటు
మెల్లగా అరిచింది;

అలికిడికి నే జూడ
"హాయ్ అల్లా" అంటు
చెట్టుచాటున ఒదిగి
యిట్టె బురఖాగుంజి,

'మెహంది' రాచినకాలు
ముందునకు చాచింది;
ముల్లు తీసితినేను,
ముల్లుగుచ్చె హసీన

... ... ...

కంటితో హృదయాన
కానరాకుండా!
తీసివేతామన్న
తీయరాకుండా !!

ప్రత్యూష ఇలా

# వేయి స్తంభాల గుడి

వేయేసి భావాలు
      వెల్లువలై పార
వేయి కండ్లున్నట్లు
      వెతికికొంచూ నేను
వేయి కాళ్లున్నట్లు
      వేవేగ పరుగిడుచు
వేయి స్తంభాల గుడికినే
      వెళ్ళి వచ్చితిని !
...    ...    ...
ఆనాటి నా స్థాన
      మాత్మలో దలపోయ,
శిల్ప సౌందర్యాలు
      చిత్రితములైనట్టి
ముద్దు బొమ్మలలోన
      మూర్తీభవించిన
ఆంధ్ర ప్రశస్తి నా
      కవగాహనం బయ్యె!
స్తంభములో నిలిపిన
      నీలి ఫలకములోన

ఆనాటి నా రూప
　　లావణ్యముల ఛాయ
ఆ నీలి మెరుగులో
　　తెలుగు వెలుగుల జాడ
అందులో నా నీడ
　　వెదకుకొను చుంటి !
పిచ్చినై నన్ను నే
　　మెచ్చుకొనుచుంటి !!
నేను పేర్చిన గోడ
　　నేను కట్టినమేడ
నేను పూసినపూత
　　నేను రాసినరాత
నేను తీర్చిన రేఖ
　　నేను చెక్కినబొమ్మ
మెరసి పోయిననాటి
　　నానోసటి గీతనే
కొలుచుకొని నన్ను నే
　　వలచు కొనుచుంటి !!

వెల్దుర్తి మాణిక్యరావు.

# సంక్రాంతి

చిగురు చెక్కిళ్ల ముంగురుల్చిక్కువడగ
మొల్లచిఱు నవ్వుమోమున మొగ్గదొడుగ
అగరు తిలకంబు బొమ్మల నందగింప
చిలుక పల్కులు పలికెను చిన్నిచెల్లె,

"అన్న యెక్కడి కేగెదు? నన్నుజూడ
సకియ సంక్రాంతి వచ్చెడు సమయమయ్యె;
క్రొత్త బొమ్మలు నీవిప్డు దెత్తువేని
ఇచ్చెదను నీకు ముద్దుల నెన్నియైన"

... ... ...

జాల సంక్రాంతి తోడుత మేలమాడి
వత్సరంబయ్యె; నెచ్చెలి వచ్చునంట
'ఎప్పుడో యెప్పుడో', యని యెదురు చూచు
ఈడు కన్నియలం గూడి యాడుకొనగ,

... ... ...

కుంకుమంబులు చల్లిగొబ్బి ముద్దలుపెట్టి
పగడాల సొగసును పరిహ సింప
పక్షివ్రాలిన భంగి పసుపు ముగ్గులు దీర్చి
పుష్య రాగంబుల పొలుపు ...

రంగార దీర్చిన రంగవల్లిక గుంపు
కన్నె తీగల వోలె వన్నెగుల్క
జడలోని మల్లెలు జారియుండిన చోటు
ముత్యాల సొగసుతో ముచ్చటాడ

చీర కుచ్చిళ్ళు పదముల చిందులాడ
తెనుగు వాకిండ్ల దిరిగెడు తీగబోండ్లు
సరస సల్లాపములు సేయు సమయమందు
పుట్టి నింటికి వచ్చెను పుష్యలక్ష్మి.

కాళ్ళకడియాలు కరముల కంకణాలు
మధుర మధుర స్వనంబుల మాటలాడ
ఆంధ్ర గృహముల గారాపు టాడుబిడ్డ
వనిత సంక్రాంతి యల్లన వచ్చునపుడు.

గంప నెత్తినబెట్టి సొంపుగా జూచుచు
జొన్న చేనున కేగు వన్నెలాడి
కొడవలి చేబూని కులుకుచు గులుకుచు
కాశె గడ్డిని గోయు కాపుకన్నె
పసుపు చీరనుదాల్చి బంతి పూవులమాల
లందంబుగా గ్రుచ్చు సుంద రాంగి
కమ్మ సంపగితోట చెమ్మ చెక్కలనాడు
చిన్నారి పొన్నారి చెలుల గుంపు

ఎదురుగానేగి "ముద్దుల వదినె రావె
మేన గోడంద్రుడు నినుజూడ మిరపతోడ
పొంతకనుపండు పొనరించు పొగడ చెట్ల
విరులు గ్రహియించి తెచ్చెడు వేళయయ్యె"

అనుచు నాహ్వాన మొనరించు నవసరాన
"ఎవరు బిల్చిరె చెల్లెల యెందు కింత
సంబరముజూపు సంక్రాంతి సకియ" యనుచు
తియ్య తీయగ బలికెడు తొయ్యలులును;

"ఎన్నిదిన ములకే తల్లి! నిన్నుజూడ
కనులు వాచెను ర"మ్మంచు కౌగలించి
మధుర ప్రియవాక్యముల నాడుమాన వతులు;
"తరుణ వతియైన మాచిల్క తల్లికిపుడు
పసుపు గుంకుమలంబెట్టి పంపవలయు"
ననుచు వచియించు నాప్తులు నప్తులరుచుండ

— — —

ఇల్లువెనకనె విలసిల్లు పల్లెతోట
విరియ బూచిన పూలతో వేడ్కసేయ
బీరపాదుల కొక్కింత దూరమందు
కొమ్మ చిక్కుడు పందిలి గ్గూరుచుండి
జారుజడ నల్లుకొనుచున్న వారిజాక్షి
లలిత సుకుమారహృదయాన మొలకలెత్తు

తీయతలపుల మనకెట్లు తెలియు గాని
నాతి పెదవుల చిఱునవ్వు నాట్యమాడు
పండుగకు దెచ్చుకొన్నట్టి బెండపూవు
వన్నెచీరను ధరియించి వచ్చుపడతి,
నాగలిని దున్నుచుండిన నాథుకడకు
సద్దిగొను పోవునొక కాపు ముద్దులాడి,

నడుము కొడ్డాణ మొక వింతకడిమి గూర్ప
నిలువుటద్దంబు కెదురుగా నెలతయొర్తు
నగుమొగమ్మున కుంకుమ సద్దుకొనుచు
నోర చూపుల జూచు నొయ్యార మార !

వంగ తోటకు వలపట వనితయోర్తు
దోసతీవల పండ్లను గోసికొనుచు
యేల పాటలు పాడెడు యింపు జూచి
రసిక హృదయాలు పొందవచ్చు రాజ్యమేలు.

పశుల మందను గాచెడు బాలుడొకడు
చింతకాయను గోయగా చెట్టునెక్క
కోదె యొకకొన్ని వెంటరా గోగణంబు
జలక మాడగనేగును చెఱువు కడకు;

చిన్నిలేగల మొదల్ చన్నుచేపగ నావు
చొక్కుమించు టాపుల చక్కదనము

పచ్చని పచ్చిక పట్టులఁ బవళించు
ప్రాయంపుటెద్దుల సోయగంబు
రంకెలు వైచుచు రంపిల్లి పోరాడు
కొమ్ముల కోడెల గ్రుమ్ములాట
ఆకుల గుడిసెకు అతి సమీపంబున
లీలగా విహరించు లేగసౌరు

అరసి తనకష్ట సుఖముల మరచిపోయి
కందిచేనున నిల్చున్న కాపువాని
కోరమీసాల కొనలందు కోదెవయసు
ముద్దుపడుచుల హృదయముల్ మోహ పెట్టు.

సగము నలిగిన పూవులు సిగనుగుల్క
రజిర కంకణ కింకిణీ రవముతోడ
చల్లజేయుచు నుండెడు గొల్ల పడుచు.
చిన్న తమ్ముడు తొట్లెలో ప్రీతితోడ
ఆడుకొనుచుండ నయిదేండ్ల అక్కతీర్చు
ఉయ్యెలను నూగు చుండెడు యొప్పుజూచి
మంద హాసంబు జేసెడు మాతృదేవి.
కమల కావాస యోగ్యమౌ కనులనుండి
దివ్యవిజ్ఞాన లతికలు తీగెవార
పురుష సూక్తము పఠియించు భూసురుండు.
మకర లక్ష్మికి నెయ్యంపు సకులుగారె?

అంప శయ్యను కొన్నాళ్లు అధివసించి
కన్నులారగ నొకమారు గాంచి నిన్ను
ప్రాణములు విడవలచె హా బ్రహ్మచారి
ఎంత ధన్యవె చెల్లెలా యింతులందు!

# పూలచెట్లు

చిన్ని బంగారు చేతుల చెంబునెత్తి
ప్రొద్దుపొడుపుతో జలము పెంచి పూలచెట్ల
కెల్ల నీర్వోసి శ్రమియించె దీపుతల్లి
ఎన్ని జన్మాల బంధమో నెంతొ తెలుప!

చెట్లమొలచె యుండు నీచిత్త మొప్పను
పూలుపూదక ఆకులు రాలకుండ
వనము గోంగమొన్న నీ పరిగిపంట
శ్యామలాదేవి ఆలయ సముఖ మునను!

తలిరు బిడ్డల గాంచిన తల్లికట్లు
ప్రాణములు లేచివచ్చును బాలికను;
ముందు పిల్లలతల్లివై మురియు నెపుడు
ఎంత ప్రేమించి పోషింతు వేమొవారి!

అన్నమును పెట్టెదంచును అమ్మనిన్ను
పిలిచె ఆకలి వేళయు తెలియ దయితి;
పరహితంబున తన్ను దామరచు టరయ
ఎన్నరో నీకుపెట్టిన విద్యయేమొ !

"ఏమొవచియించు చుంటివి యింతసేపు
చాలునిక నీదువాక్యాలు చాలు"ననుచు
కిలకిల నునవ్వ దానిమ్మ గింజలచట
రాలెనను భ్రాంతి ఆచిల్క వ్రాలెనేమొ!

దేవులపల్లి రామానుజరావు

# 'నేను'

పిలుస్న ప్రతిచోట విర్రవీగుచు అపర
హిట్లరౌతాను నే - హిట్లరౌతాను;
తలదన్ను వానికడ - తలవంచి 'దయ' అను
గాంధి నౌతాను నే - గాంధినౌతాను.

మంది తప్పులనేరి - మనసు ఖాతా నింపి
వడ్డి వడ్డీకట్టి - వల్లించుతాను
నాతప్పులను దాచ- నానారకాలైన
ధర్మసూత్రాలతో - దడికట్టుతాను !

# హృదయావేదన

అవనిపై జరిగేటి
అవకతవకలు జూచి
ఎందుకో నా హృదిని
ఇన్ని ఆవేదనలు ?

తప్పు దిద్దగ లేను;
దారి జూపగలేను;
తప్పుజేసినవారి
దండింపగాలేను;

కష్టపడువారలను
కాపాడలేను;

అవనిపై...

పరుల కష్టము జూచి
పగిలిపోవును గుండె
మాయమోసము జూచి
మండిపోవును ఒళ్లు
పతిత మానవు జూచి
చితికిపోవును మనసు

అవనిపై...

... ... ...

అవకతవకలు నేను
సవరింపలేనపుడు,
'పరులకష్టములోన
[illegible]
అన్యులను జూపైన
హాయిగా మనలేను!

అవనిపై...

# ప్రపంచం

గడియగడియకు మారుప్రపంచం
గప్పకుసూ కొరగాని ప్రపంచం!
పొందోలపై బడెడుప్రపంచం
కొరగనే కొమ్మెక్కు ప్రపంచం
వలవనగ మెడబడెడు ప్రపంచం
వలచినచో పైదొలగు ప్రపంచం
ఆసపెట్టి ఆడించు ప్రపంచం
మోసపుచ్చి మురిపించు ప్రపంచం
సమరాలకు 'సయ్యో'నెడి ప్రపంచం
'శాంతిశాంతి'యని చాటుప్రపంచం
వక్రమార్గ వర్తనల ప్రపంచం
సక్రమ బోధల సల్పు ప్రపంచం
నీతిరహితమై నెగడు ప్రపంచం
నీతినియమముల నేర్పు ప్రపంచం
వియ్యాలకు వేంచేయు ప్రపంచం
కయ్యాలకు కాలుదువ్వు ప్రపంచం
నిలుపుదోపిడుల నిత్యప్రపంచం
చిలుక పలుకులను పలుకు ప్రపంచం
దయాధర్మముల దండి ప్రపంచం
తడిగుడ్డల మెడగోయు ప్రపంచం||గడియ||

# ఆత్మహత్యం!

మానవుని హృదయంబు
మానవుని
మానవుడు
మానవుని
మాదిరిగ
మన్నించలేనంత మలినమైనాది ॥మా॥

జాతియని
రీతియని
దేశమని
వేషమని
పసముగక్కె వింత
దిసగ మారినది — ॥మా॥

అధునిక
ఆర్భాట
మందణగి
అవనియే,
ఆత్మహత్యమై, జనుల
అడవి యయినాది— ॥మా॥

# దీపావళి

అమవస చీకట్లు
నాకాశమునకంపి
మిరుమిట్లు కొల్పేటి
మెరుపుదీపాలు ...
మేడమిద్దెలందున
[illegible]లనుంచి
వేయిరంగుల వెలుగు
వింత దీపాలు....
ఊరివెలుపలనున్న
పూరిగుడిసెలమూల
లోనిచీకటిబాప
లేనిదీపాలు...
దోచి దాచిన దెంతో
దుర్భాగ్యులకు జూప
ధనపూజ చేయింతు
ధర్మ దీపాలు...
రక్కసుని చాపుచే
రంజిల్లె [illegible]ంచము
కోటిపల్లెలపాటె
నాటి దీపాలు;
రక్కసులు బాధింప
రక్తమే లోకంపు
కోటిరీతుల దెబ్బ
నేటి దీపాలు !!

కాళోజి నారాయణరావు

# ఓరుంగల్లు కోట

తుక్కులు చింపువిస్తరిగ గూలిన యోర్గులు కోటగంటివే
యుక్కున ప్రాణముండియును యూరికి పేరముగల్గ నాంధ్రుడా;
ఒక్కొకరమ్ము ఫాలమున నుంచెదు 'నాబహుపాప' మంచునో!
చుక్కల చందమామ తలసూపడె తిర్గి ప్రతాపరుద్రుడై !!

తక్కినమాట చేయుటకి? 'తన్నిన వెన్నున చప్పుడాయెని
పైక్కడనో' యటంచు వెనుకేనియు జూడని సోమయల్ నృపుల్
దిక్కయి దీనికింత గతిదెచ్చిరి! కాకతి దెబ్బయిన్ రుషల్
గ్రక్కెడిపోట, గర్జిలెడి గడ్డపుమేకలు గూబమూకలున్ !!

స్త్రీమేత ముట్టక నందనేల బట్టి
కెనిసిపడి యున్నదేటికో తెనుగుబిడ్డ!
ఆంధ్ర సామ్రాజ్య మిచటికి నస్తమించె,
గోపులను బీకికొని తను ఘోరకాల
మరుగు దెంచుట దలచి, బందగుచుగూరె!!
చెడిన ముఖముల నాకొట్టుబడిన యంగముల
నెగయరే వోయీ హంసము? లటుగాక
శిల్పప్రతిఫలయుగయు గాల్జెప్ప గానా?
చావమోదు దుష్టులచేష్ట సాక్ష్యమిడనా?
ఆగెమాయాంధ్ర శిల్పుల హంసలనిన
బండలై, పాలు నీరువేర్పరచి చూపు!

